# ఆంధ్రపత్రిక.



316404


The Andhra Patrika, Madras. | Regd. No: 1118. | Vol 32. | MONDAY, 4th June, 1945. | No. 53. | వెల ఒకఅణా. | Founder : K. Nageswara Rao.


# "సిరియా అల్లరులకు బ్రిటిష్ ఏజెంట్లే కారకులు:" డీగాల్ ఆరోపణ

## "వీటో" సమస్యపై ఫ్రిస్కోలో తర్జనభర్జన

### తిరిగి చర్చజరగాలని రష్యా సూచన:

### మిగతా అగ్రరాజ్య ప్రతినిధుల అసాభంగం

శాన్ ఫ్రాన్సిస్కో, జూను 2: ప్రపంచ భద్రతామండలిలో పర్మనెంటు సభ్యత్వం గల 5 పెద్ద రాజ్యాలు అనగా, అమెరికా ఇంగ్లండు, రష్యా, చైనా, ఫ్రాన్సులకు వీటో అధికారం ఉండవలెనా అక్కరలేదా అనే విషయమై శాన్ ఫ్రాన్సిస్కో సభలో ఇదమిత్థమని తీర్మాన నిర్ణయము కాలేదు. అందువల్ల సంయుక్తరాజ్యాల సభా వ్యవహారములు యీమధ్య స్తంభించాయి. వీటో సమస్యనుగూర్చి తిరిగి చర్చ ఉపక్రమింపవలెనని రష్యాకోరింది.

ప్రపంచ భద్రతామండలిలో పైజెప్పిన 5 పెద్ద రాజ్యాలు పర్మనేంటు సభ్యులు. వీరుగాక, అస్థిర సభ్యులుగా మరొక 6 రాజ్యాలవారు ఉంటారు మొత్తము 11 సభ్యులుగల యీ భద్రతా మండలిలో ఏదైనా ఒక తీర్మానం చేయబడినప్పుడు ఆ తీర్మానములను పైజెప్పిన అయిదు రాజ్యాలవారిలో ఎవరైనా నిరాకరిస్తే ఆ తీర్మాన నిర్ణయమును [illegible] జరుపకూడదు. రెండు రాజ్యాలకు [illegible] గాదావచ్చినప్పుడు ఆ తగాదా పరిష్కారమునకై సైనిక బలమును ప్రయోగించవలెనని ప్రపంచ భద్రతామండలి తీర్మానింపవచ్చును. లేదా సౌమ్యంగా సంప్రతింపులు రాయబారములు చర్చలు సాగించి పరిష్కారం చేయవలెనని తీర్మానించవచ్చును. కాని, పైజెప్పిన అయిదు పెద్దరాజ్యాలవారెవరైన అట్టి తీర్మానమునకు ప్రతికూలురగా నున్నయెడల, ఆ తీర్మానమును త్రోసివేయుటకు అనగా 'వీటో' చేయుటకు వారికి అధికారముండవలెను. అయిదు పెద్దరాజ్యాలవారిలో ఎవరైనా వీటో చేస్తే ప్రపంచ భద్రతామండలి ఆ తీర్మానమును అమలుజరుపకూడదు.

పెద్దరాజ్యాలవారి వీటో అధికారము సైనికచర్యల గూర్చిన తీర్మాన విషయములోనే ఉండవలెననియు లేక సౌమ్యపరిష్కార పద్ధతిని గూర్చిన తీర్మానవిషయములో ఉండకూడదనియు అమెరికా బ్రిటనులు వాదించాయి.

వీటో అధికారము ఏ సందర్భంలో ఏవిధంగా ప్రపంచభద్రతా మండలిలోని పెద్దరాజ్యాలవారు చెలాయించ వలెననే విషయములో ధర్మసందేహము నివర్తి కాలేదు. ఈ సమస్యను తిరిగి సాంగోపాంగంగా చర్చించి తర్జన భర్జన చేయవలెనని రష్యాకోరింది.

గతరాత్రి బ్రిటను, అమెరికా, చైనా, ఫ్రాన్సు ప్రతినిధులు సమావేశమై ఏకాభిప్రాయమునకు రావలెనని సమాలోచనలు జరిపిరి. వీటో అధికారసమస్య పరిష్కారం అయితే, యితర చిల్లర సమస్యలన్నీ కూడా పరిష్కారమగుటకు మార్గము కన్పించగలదు. అనేక చిల్లర సమస్యలు ఇంకా పరిష్కారం కావలసియున్నప్పటికి జూనునెల మధ్యకు సంయుక్త రాజ్యాల సభ సమాప్తం కావచ్చునని ఫ్రిస్కో-సభకు వచ్చిన ప్రతినిధులందరూ ఆశించుచున్నారు.

రష్యా ప్రతినిధివర్గ నాయకుడగు అంద్రూ గ్రోమికోగారు వీటో అధికారం విషయంలో రష్యా ప్రభుత్వాభిప్రాయములను వివరిస్తూ అమెరికా, బ్రిటను, చైనా, ఫ్రాన్సు ప్రతినిధులకు ఒక లేఖను అందజేశారు. అందులో యీ క్రింది విషయములను వివరించినట్లు గా తెలియుచున్నది.

ఏదైనా అంతర్జాతీయ తగాదా విషయంలో ప్రపంచ భద్రతామండలిలోని 5 పెద్ద రాజ్యాలవారు ఏకాభిప్రాయులై కర్తవ్యమును నిర్ణయించినప్పుడు, ఆ నిర్ణయమును అతిక్రమిస్తూ ఎవరైనా ప్రపంచ భద్రతా మండలికి మహాజర్లు పెట్టుకొన్నప్పటికి అట్టి మహాజర్లనన్నింటినీ కూడా ప్రపంచ భద్రతా మండలి స్వీకరించి [illegible] చేకోకూడదు.

ప్రపంచ భద్రతామండలి ఏ కర్తవ్యమునైనా ఇదమిత్థమని నిర్ణయించినప్పుడు

### ఫ్రిస్కో సభకు ట్రూమనుగారి ప్రయాణం

ఫ్రిస్కో-సభ జూను 6 తేది నాటికి, సమాప్తమగుననియు ఆ నాటికి అమెరికా ప్రెసిడెంటగు ట్రూమనుగారు, ఫ్రిస్కో-సభకు వెళ్లి సభను ముగించుచు ఉపన్యాసము చేయవలెనని సంకల్పించారు కాని, జూను 6 తేది నాటికి సభ పూర్తిఅయ్యేట్లుగా లేదు. అందువల్ల సభ ఎప్పుడు సమాప్తి కానున్నదో అప్పటికి ట్రూమనుగారు సాన్ ఫ్రాన్సిస్కో-కు వెళ్లి ఉపన్యసిస్తారు.

అయిదు పెద్ద రాజ్యాలవారిలో ఏ రాజ్యమైనను ఆ నిర్ణయమును త్రోసివేయుటకును రద్దు చేయుటకును అధికారం కలిగియుండవలెను.

వీటో అధికారం ఇంత విపరీతంగా ఉండకూడదని బ్రిటను వాదించింది.

ప్రపంచశాంతిరక్షణ సంస్థ ఏదైనా అంతర్జాతీయ వివాదములను అణచివేయుటకై సైనిక దండయాత్రను ప్రపంచశాంతి రక్షణ సంస్థచేయవచ్చును. అందుకొఱకు ప్రపంచశాంతి రక్షణసంస్థకు కావలసిన సైన్యమును అందులో సభ్యత్వం గల రాజ్యాలవారు సప్లయిచేయవలెను. ఆవిషయమును అయిదు పెద్దరాజ్యాలవారు అంగీకరించుచు ఒక్కొక సభ్యరాజ్యము ఎంతసేనను సప్లయిచేయవలెనో ప్రపంచభద్రతా మండలితో ఖరారు చేసికోవలెనని ఆస్ట్రేలియా ప్రభుత్వం ఒకసలహా సూచించింది.

అమెరికను ప్రతినిధి మరొక పద్ధతి సూచించాడు. ప్రపంచ సమితిలో చేరిన రాజ్యాలలో ఒక్కొక్క రాజ్యం మిగిలిన రాజ్యాలతో వేర్వేరుగా యీ సైన్యం సప్లయి విషయములలో ఒడంబడికలను వ్రాసికోవడం మంచిది.

కాని అనేక రాజ్యాలతో అనేక ఒడంబడికలను వ్రాసికోవడంకంటె ప్రపంచ సమితితో ఒక్కటే ఖరారు వ్రాసికోవడం ఉత్తమమని పెక్కురాజ్యాల ప్రతినిధుల అభిప్రాయంగా ఉంది.

### 60 కోట్ల పరాధీన ప్రజలకు స్వాతంత్ర్యం యివ్వాలి

ఫిలిప్పయిను దీవుల ప్రతినిధియగు జనరలు కార్లో రామ్యులోగారు సత్కారం నాడు యిలా అన్నారు.

ప్రపంచంలో 60 కోట్ల ప్రజలు పరాధీనులై యున్నారు. వారందరికి స్వాతంత్ర్యము నొసంగుటకు ప్రపంచసమితి దీక్ష వహించి పూనుకోవలెను. ప్రపంచ సమితి ప్రణాళికలో యీ ప్రతిజ్ఞ చేయాలి. ఈ విషయమై నేను ఫ్రిస్కో సభ సాధారణ సమావేశంలో వాదించదలచుకొన్నాను.

ప్రపంచ ప్రణాళికలోని మొదటి భాగంలో యీ ప్రతిజ్ఞను ఉపసంహరించి రెండోభాగంలో ధర్మకర్తృత్వమునుగూర్చిన భాగంలో పొందుపరచవలెనన్నారు. కాని, ప్రపంచజాతుల స్వాతంత్ర్యమునుగూర్చిన ఆశయహస్తం మొదటిభాగంలో నేచేర్చిరి.

నేను ఫిలిప్పయిను దీవుల స్వాతంత్ర్యాన్నిగూర్చి మాట్లాడుటలేదు. ఎందుకంటే ఫిలిప్పయిను దీవులకు స్వాతంత్ర్యం స్థిర నిర్ణయమైనది. ఇంకా ప్రపంచంలో 60 కోట్ల ప్రజలు స్వాతంత్ర్యం లేకుండా ఉన్నారు. వారివ్యక్తిత్వం వికాసంపొందడానికి స్వాతంత్ర్యం కావాలి. యీ ప్రజా స్వాతంత్ర్యం కోసమే యీ మహాసంగ్రామం జరిగింది.

## మన సంప్రదాయాలకు, సంస్కృతికి అనుగుణమైన "స్వదేశీ రాజ్యాంగం"

### మహాత్ముని సహాయంతో అగర్వాలాగారు తయారుచేస్తారు

పంచగనీ, జూన్ 2: 'గాంధి పథకము' అను గ్రంథమును రచియించియుండిన శ్రీ ఎస్. ఎన్. అగర్వాలాగారు నేడు గాంధిమహాత్ముని సందర్శించి వారితో భారత సంప్రదాయములపైనను, విజ్ఞానముపైనను ఆధారపడు అచ్చమైన 'స్వదేశీ' రాజ్యాంగవిధానమును తయారుచేయు విషయమై ఒక గంటసేపు చర్చించిరి. ఈ ఉద్దేశ్యమును మహాత్ముడు ఆమోదించెను. ఇట్టి రాజ్యాంగవిధాన ప్రధాన సూత్రముల విషయమున అగర్వాలాగారికి మార్గముచూప మహాత్ముడు వాగ్దానమొసంగెను.

ఇందువిషయమై పత్రికా ప్రతినిధితో ముచ్చటించుచు అగర్వాలాగారిట్లు చెప్పిరి: ఈ రాజ్యాంగవిధానమునకు 'గాంధేయ రాజ్యాంగ విధానము' అని నామకరణము గావింప సంకల్పించు చున్నాను. ఈ రాజ్యాంగవిధానమునకు గ్రామము ఆధారభూతంగా వుండును. దీని ననుసరించి అధికారము ఒక్కచో కేంద్రీకృతమగుటకు బదులు దేశ మందంతట వరచబడును. రాజకీయాధికారములు స్వతంత్ర గ్రామ సంఘముల అధీనమైయుండును. కేంద్ర ప్రభుత్వ మొకటి యుండుననుట నిస్సందేహము. కాని గాంధి మహాత్ముని ఆశయముల ననుసరించు రాజ్యాంగవిధానము 'సాధ్యమైనంత తక్కువగా పరిపాలనాధికారము నెరుపు ప్రభుత్వము అత్యుత్తమమైనది' అనుసూక్తిపై ఆధారపడియుండును.

జులైలో మహాత్ముడు వార్ధా చేరునప్పుడు తన రాజ్యాంగ విధాన ప్రధానసూత్రములను వారికి నివేదింప వీలగునని అగర్వాలాగారు ఆశించుచున్నారు. (అ. ప్రె.)

### వస్త్రాల రేషనింగు

బొంబాయి, జూన్ 2:

వస్త్రాల రేషనింగు స్కీము రేపటినుండి బొంబాయి నగరంలోను అమలులోకి వచ్చును.

### హాన్స రాటర్ ఖైదీగా చిక్కాడు

డచ్చి రేడియో ప్రకటన

లండను, జూన్ 2: హాలెండులో నాజీ గెస్టాపో దళాధిపతిగా పనిచేసిన జనరల్ హాన్స రాటర్ జర్మనీలో ఖైదీగా చిక్కాడని డచ్చి రేడియో ప్రకటిస్తున్నది.

### అమెరికాకు కాలనీల ఆశ

#### పసిఫిక్ యుద్ధం అంతరార్థం

లండను, జూను 2: పసిఫిక్‌లో కాలనీలు పొందాలనే ఉద్దేశ్యంతో అమెరికా దేశం పసిఫిక్ యుద్ధం సాగిస్తోందని అనటానికి ఆధారాలు ఎక్కువగా కన్పిస్తున్నాయని ఇజ్వెస్టియా అనే సోవియట్ వార్తాపత్రికకు ఆ పత్రిక సాన్ ఫ్రాన్సిస్కో విలేఖరి వ్రాశాడు. ఈ విషయం మాస్కో రేడియో యీ రాత్రి బ్రాడ్ కాస్టు చేసింది.

పెసిఫిక్ దీవులు అమెరికా కాలనీలు కావాలని పత్రికలలోను సభలలోను రాజకీయవర్గాలలోను తీవ్రంగా ప్రచారం జరుగుచున్నదట. ఇతర విధమైన పరిష్కారం అసంభవమని ప్రజాభిప్రాయం. ఆసియా ఖండంలో కాలనీలను ఆశించటానికి బదులు అక్కడి ప్రజల స్వాతంత్ర్యానికి అమెరికా పాటుపడితే మంచిదని లాటిమన్ చేసిన విమర్శకు నేను విరుద్ధంగా అమెరికనల ప్రచారం సాగుతోందని ఇజ్వెస్టియా విలేఖరి అంటున్నాడు. రాయిటరు.

## త్రైరాజ్యసభలో ఈసమస్యపై చర్చకు ఫ్రాన్సు ఒప్పుకోదట

### బ్రిటిష్ సైనికులు 6 లక్షలమంది వుండగా ఫ్రెంచిసైనికులు 5 వేల మందేనని వివరణ

### 'చర్చిల్‌ప్రకటన అందకపూర్వమే కాల్పులు విరమించారు'

పారిస్, జూన్ 2: "బ్రిటిషు ప్రతిపాదనను అనుసరించి సిరియా సమస్యను మూడురాజ్యాల సమావేశములో చర్చించుటకు ఫ్రాన్సు సమ్మతింపదు." అని జనరల్ డిగాల్ స్పష్టంచేసినాడు. సిరియా అల్లరులకు బ్రిటిషు ఏజెంట్ల ప్రోద్బలమే కారణం అని కూడా ఈయన ప్రకటించినాడు.

చర్చిల్ విజ్ఞప్తి తనకు అందకపూర్వమే తాను కాల్పులను ఆపవలసిందని లెవాంట్ రాజ్యాలలోని ఫ్రెంచిసేనానికి ఉత్తరువులు పంపినట్లు డిగాల్ పత్రికావిలేఖరులకు తెలియజేసినాడు.

ఒక్క సిరియా, లెబనాన్‌ల విషయమేగాక, యావత్తు అరబ్ రాజ్యాల సమస్యలను చర్చించడానికి ఫ్రాన్సు సిద్ధంగా ఉన్నదని డిగాల్ ప్రకటించినాడు.

**సిరియన్ రక్షకభటులు, ప్రజలు, బ్రిటిషు ఆయుధములతో ఫ్రెంచి సైనికులపై యుద్ధం ప్రారంభించినారనీ, బ్రిటన్ ఇంకా ఇక్కడ (సిరియా, లెబనాన్ దేశములలో) 600,000 సైనికులను అట్టే వుంచిందనీ ఫ్రెంచిప్రధాని డిగాల్ అభియోగం, ఫ్రాన్స్ 5,000 మంది సైనికులను మాత్రం ఇక్కడవుంచి మిగిలినవారి నందరినీ ఉపసంహరించుకున్నదని ఈయన నివేదించినాడు.**

### లండన్ పత్రికల ఆశలు

లండన్, జూన్ 2: జనరల్ డిగాల్ లండన్ సంప్రతింపులకు వచ్చే ధోరణిలో లేడని పారిస్ వర్గాలవారు భావించుచూవున్నా లండన్ పత్రికలు మాత్రం డీగాల్ లండన్ రావచ్చునని ఆశిస్తూ వున్నవి. డీగాల్ స్వయంగా సమావేశానికి వస్తే బ్రిటిష్ ప్రధాని చర్చిల్ అమెరికా అగ్ర ప్రతినిధి డేవిస్, జనరల్ డిగాల్ మధ్యనే సంప్రతింపులు జరుగుతేవని డెయిలీ టెలిగ్రాఫ్ పత్రిక వ్రాస్తూఉన్నది. ఒక్క డెయిలీ హెరాల్డు తక్క మిగిలిన బ్రిటిష్ పత్రికలు అన్నీ సిరియా లెబనాన్‌లలో కాల్పులువిరమింపబడినందుకు సంతృప్తిని ప్రకటించినవి. బ్రిటన్ అమెరికాలోకి సైపునా, ఫ్రాన్స్ మరో సైపునా వుండి ఈ రెండుపక్షాలకూ మధ్య వున్న తీవ్రతరస్థితి తొలగలేదని డెయిలీ హెరాల్డ్ పత్రిక వ్రాసింది.

బ్రిటిష్‌ప్రధాని సందేశం డిగాల్‌కు అందకపూర్వమే బహిరంగమైనందుకు ఫ్రెంచివర్గాలు అసంతృప్తి చెందినవని బ్రిటిష్ విదేశాంగ కార్యస్థాన ఉద్యోగికి తెలియచేయగా మామూలు లాంఛనాల ప్రకారం ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేవరకూ బ్రిటన్ వోక్యం కలిగించకపోయింటాంటే వీలు లేదనిఆయన అన్నాడు. బ్రిటిష విదేశాంగమంత్రి ఈడెన్ పార్లమెంటులో చర్చిల్ సందేశాన్ని ప్రకటించే సమయానికి డిగాల్‌కు చర్చిల్‌పంపిన జాబు ఫ్రెంచి గన్డైమీదనే ఉన్నదని ఈయన తెలిపినాడు. ఫ్రెంచి సిరియా సమస్యమీద రష్యానుండి వర్తమానం వచ్చిందని ఈయనస్పష్టపరచినాడు. బ్రిటన్, అమెరికాలు సమానప్రాధాన్యంలో శాంతి ఆవశ్యకత విషయంలో ఎలాంటి భావాలను ప్రకటించిందో సరిగ్గా రష్యా కూడా అదే ధోరణిని అనుసరించిందని ఈయన ప్రకటించినాడు.

### న్యూ స్టేట్స్‌మన్ విమర్శ

"ఇరాక్‌లో మనకు సైనిక వైమానిక ఆశ్రయాలు ఉన్నవి. ఇరాక్‌ను మనం ఏమి కోరుతూ ఉన్నామో ఫ్రాన్స్ సిరియా లెబనాన్‌లనుంచి అదే కోరుతూ వుంది" అని న్యూ స్టేట్స్‌మన్ అండ్ నేషన్ పత్రిక వ్రాసింది.

"పర్షియా-బ్రిటిషు సంబంధాలైనా అంత తృప్తికరంగా లేవు. ప్రజలు దాసోహం అనేలాగా చేయడానికి మనం రెండు దఫాలు విమానాలనుంచి పల్లెలపై బాంబులు వేసినాము. స్థానిక ఫ్రెంచి సేనానులు తమ అధిక ప్రస్తావనలను విరమించుకునేలాగా ఫ్రెంచి ప్రభుత్వంచేత ఈడెన్ చేయించలేకపోతే అరబ్ రాజ్యాలు యావత్తూ అంటుకునేలా అవుపెంచుతున్నాని" అని ఈ పత్రిక హెచ్చరించింది.

### కలకత్తా: కున్మింగ్ టెలిఫోను సౌకర్యం

కున్మింగ్, జూన్ 1: చైనాలోని కున్మింగ్ నగరానికీ, కలకత్తా నగరానికీ మధ్య టెలిఫోను సౌకర్యం ఏర్పాటైంది. చైనాకు త్వరగా సరఫరాలు అందజేయడానికి ఈ సౌకర్యం ఉపయోగపడుతుంది.

సిరియా సమస్య త్రైరాజ్య సంప్రతింపుల ఫలితంగా పరిష్కారం కావాలీ అంటే అశేష రాజనీతి చతురత అవసరంఅని రాయిటర్ రాజకీయ విలేఖరి వ్రాస్తున్నాడు.

వెంటనే కాల్పులను విరమించవలసిందని ఫ్రెంచిప్రభుత్వం ఉత్తరువు చేయడం, చర్చిల్ సందేశంపై ఫ్రెంచిపత్రికలు "మృదువుగా"నే విమర్శించడంబట్టి సమస్య సంతృప్తికరంగానే పరిష్కారం కావచ్చునని తోస్తున్నది.

రాజకీయంగానూ, సైనికంగానూ ఫ్రాన్స్ పూర్తిగా ఉపసంహరించుకుంటేనే సిరియా, లెబనాన్‌లు సంతృప్తి

(2 వ పేజీ చూడుడు)

## దేశాయి, జిన్నా, సావర్కర్ గార్లకు వైస్రాయి ఆహ్వానం?

### తన పథక వివరాలను వేవెల్ ముందు కార్యవర్గసభ్యులకు నివేదించవచ్చు

(యునైటెడ్ ప్రెస్)

లండన్, జూన్ 2: భారతదేశ రాజకీయ నాయకులతో రాజప్రతినిధి సమాలోచనలు పూర్తి అయేవరకూ రాజకీయ ప్రతిష్టంభనను గురించి ఏవిధమైన ప్రకటన వెలువడదని తెలుస్తున్నది. కాంగ్రెసు తరఫున భూలాభాయి దేశాయిగారినీ, ముస్లింలీగు తరఫున జిన్నాగారినీ, హిందూమహాసభ తరఫున వి. డి. సావర్కర్‌గారినీ పిలిపించుకొని వేవెల్ సమాలోచని జరుపుతాడని తెలుస్తున్నది.

### గాంధి, జిన్నాలతో వైస్రాయి సమాలోచన?

ఇండియన్ యునైటెడ్ ప్రెస్ వార్త ఇంకా ఇలాకూడా తెలియజేస్తున్నది. వైస్రాయి వేవెల్ ఇండియాకు 1 వ తేదీ ఉదయం ప్రయాణమైనాడు. భారత ప్రతిష్టంభన పరిష్కారానికి ఇతడు ఏ ప్రతిపాదనలతో వెళ్లుతున్నది ఎవరికీ స్పష్టంగా తెలియదనే చెప్పవచ్చు. భారత దేశనాయకులు ఈ కొత్తప్రతిపాదనలను ఆమోదించడంపైనే రాజకీయ ఖైదీల విడుదల ఆధారపడి వుంటుందని తెలుస్తున్నది. తన ప్రతిపాదనలను బయటపెట్టడానికి పూర్వం వైస్రాయి గాంధి, జిన్నాలను పిలిపించుకొని సంప్రతిస్తాడేమో నని కొంతమంది ఊహిస్తున్నారు.

లార్డ్ వేవెల్ సోమవారం నాటికి న్యూఢిల్లీ చేరతాడనితెలుస్తున్నది. చేరినవెంటనే వేవెల్ కార్యవర్గసమావేశం జరిపి, తాను తెచ్చిన పథకాన్ని వారికి వివరించవచ్చు.

భారత ప్రతిష్టంభనాపరిష్కారం విషయంలో తమ సంకల్పం ఏట్టిదో స్పష్టపరుస్తు లండన్, న్యూఢిల్లీలనుంచి ఒకేసారి ప్రకటనలు వెలువడవచ్చు. పార్లమెంటు రద్దుగాకపూర్వమే, బహుశా ఈబుధవారంనాడే-బ్రిటిష్‌ప్రభుత్వ ప్రతిపాదనలపై కామన్సుసభలో చర్చజరగవచ్చు.

### భారతస్వాతంత్ర్యం: అమెరికనుల వైఖరి

(అమెరికను అసోసియేటెడ్ ప్రెస్)

న్యూయార్కు, జూన్ 2: "ఆసియా అమెరికా బంధాలు" అనే పత్రిక జూన్ సంచికలో ఎస్. ఎస్. చంద్రశేఖర్ గారు ఇలా వ్రాస్తున్నారు. "సామ్రాజ్యవాదంవల్ల అమెరికనులకు ఏ విధమైన ప్రయోజనమూ లేదు. భారతదేశం స్వతంత్రదేశం కావాలనే అమెరికనులు స్పష్టంగా వాంఛిస్తున్నారు. యుద్ధానంతరం భారతదేశ స్వాతంత్ర్యహక్కు విషయంలో అమెరికనులమధ్య భేదాభిప్రాయం వున్నది. ఈ మహాసంగ్రామం, భారతదేశంనుంచి సరియైన వార్తలను రానివ్వక పోవడం, బ్రిటిషువారి ప్రచారం, 'న్యూయార్కు టైమ్సు' మొదలైన పత్రికలు భారతదేశానికి విరుద్ధంగా ప్రకటనలు చేయడం మొదలైన కారణాలన్నిటివల్లా అమెరికనులలో భేదభావాలు ఏర్పడినవి." బొంబాయినుంచి వెలువడే అమృతలాల్ డి శేఠ్‌గారి పత్రికల తరఫున చంద్రశేఖరుగారు అమెరికాలో ప్రతినిధిగా ఇటీవలనే నియమితులైనారు.

## "భారతసమస్య పరిష్కారమై తీరాలి"

### కాన్సర్వేటివ్ సభ్యుని ప్రకటన

లండన్, జూన్ 2: భారతదేశ ప్రస్తుతస్థితి అటు భారతీయులకూ, ఇటు బ్రిటిషువారికీకూడా అప్రతిష్ఠ మారిందని ఒక ప్రముఖ కాన్సర్వేటివ్ సభ్యుడు (మాజీ ఆరోగ్య శాఖామంత్రి) కెప్టెన్ వాల్టర్ ఇలియట్ అన్నట్లు రాయిటర్ రాజకీయ విలేఖరి డేవిడ్ వైటన్ తెలియజేస్తున్నాడు. ఈ కాన్సర్వేటివ్ పక్ష సభ్యుడు ఇంకా ఇలాకూడా తెలుపుతున్నాడు: "క్రిప్సు ప్రతిపాదనలను ఆమోదించినా ఆమోదించక పోయినా, పాకిస్థాన్ ఏర్పడినా, ఏర్పడక పోయినా, జపానుయుద్ధం ఇప్పటిలో సమాప్తమైనా, కాకపోయినా, భారతసమస్యను పరిష్కరించకుండా వుండడానికి వీల్లేదు. ఏదో విధంగా పరిష్కరించితీరాలి. ఈ సారి వచ్చే ప్రభుత్వం పరిష్కరించవలసిన అతిప్రధాన సమస్యలలో ఇది ఒకటి."

"డెయిలీహెరాల్డు" రాజకీయ విలేఖరి ఈ ఉదయం ఇలా వ్రాశాడు. "ప్రస్తుతం వేవెల్ ప్రతిపాదించబోతున్న పథకంలో భారతసమస్యాపరిష్కారానికి రాజప్రతినిధికి బ్రిటిషుప్రభుత్వం చాలావరకు అధికారం ఇచ్చింది. ప్రజాపక్ష ప్రతినిధులతో కేంద్రప్రభుత్వ స్థాపనకు స్పష్టమైన భావాలు ఇందులో పొందుపరిచారనే తెలుస్తున్నది. జపానుపై యుద్ధవిజృంభణ సాగిస్తూనే, యుద్ధానంతరం దేశ అభివృద్ధికి విశాలమైన ప్రాతిపదికను వేయడంకూడా జరుగుతుందని వినికిడి. వేవెల్ సూచించే పథకం భారతసమస్యను సమగ్రంగా పరిష్కరించడానికి ఉపయుక్తమైనదికాదు. ఐనప్పటికీ బాధ్యతాయుత రాజకీయ పక్షాలవారి ఆమోదాన్ని పొందవచ్చు.

### అసఫాలీకి గాంధిజీ తంతి

పంచగని, జూన్ 2: గాంధిజీ అసఫ్‌అలీ అనారోగ్యం గురించి ఆందోళన చెందుతూ వున్నారు. ప్రస్తుతస్థితి ఎలా వుందీ తెలియచేయవలసిందిగా గాంధిజీ అసఫ్‌ఆలీకి తంతి ఇచ్చినారు.

## ప్రతిపాదనలు విఫలమైతే-

### "భారతీయులు అతివాద విధానాన్ని అవలంబిస్తారు"

'ఎకనమిస్ట్' పత్రిక హెచ్చరిక

లండన్, జూన్ 2: "ఎకనమిస్టు" పత్రిక భారతసమస్యను గురించి నేటి సంపాదకీయంలో ఇలా వ్రాసింది. ఇండియా కార్యాలయాన్ని మూసివేసి దాని కార్యకలాపాలను అధినివేశ కార్యాలయానికి మారుస్తామని ఎమ్మెర్సు జెవిను గత వారం మాట ఇచ్చాడు. ఇప్పటివరకు కార్మిక పక్షంవారు చేసిన వాగ్దానా లన్నిటిలో దీనిని కొత్త దానిగానే భావించవచ్చు. దీన్ని బ్రిటిషువారు సౌమనస్య భావంతో చేసిన సూచనగానే భారతీయులు భావించవచ్చు. దీనివల్ల ఆచరణలో పెద్దప్రయోజనమేమీ వుండబోదని భారతీయులకు తెలిసిన సంగతే. భారతదేశంలో బ్రిటిషుప్రభుత్వం శ్రద్ధవహించవలసిన బాధ్యతలు ఉన్నంతవరకూ అధినివేశ రాజ్యాల యెడల అనుసరించే వైఖరికీ, భారతదేశంయెడల అనుసరించే వైఖరికీ భేదం వుండక తప్పదు."

వేవెల్ రాయబారాన్ని గురించి ఇదే పత్రిక ఇలా వ్రాస్తున్నది: "పార్లమెంటు ఎన్నికలు జరగబోతున్న ఈ సమయంలో కార్మిక ప్రముఖుల ప్రచారాన్ని అరికట్టడానికి బ్రిటిషు ప్రభుత్వం భారత సమస్య విషయమై ముందు మాపుతో చర్చకు దిగవచ్చు. దీనివల్ల ఫలితమేమీ లభ్యం కాకపోతే, ఎన్నికలలో చర్చిల్ పక్షానికి కొంత అంగోళన తప్పదు; భారతసమస్య విషమించకా తప్పదు. భారతదేశంలోని జాతీయ వర్గాలవారు ఈ బ్రిటిషు ఎన్నికలద్వారా విశేష ఫలితాన్ని సాధించాలని ఆశిస్తున్నారు. ఇది దుర్లభమైతే, భారతీయులు అతివాదధోరణిలో ఇప్పటికంటే ఎక్కువ బలవన్విధానాలకు దిగవచ్చు. అప్పుడు మనవారు మితవాద దృక్పథంతో ఎంత నిర్మాణాత్మక పద్ధతులను సూచించి నప్పటికీ, భారతీయులు తోసి రాజనడం సంభవిస్తుంది."

### జనరల్ ఐసెన్ హోవర్

అబిలీన్ (కాన్సాస్) జూను 3: జనరల్ ఐసెన్ హోవర్ ఈ 16 వ న్యూయార్కుకు వస్తారు, ఈయన స్వగ్రామము అబిలీన్‌లో ఈయనకు ఘనమైన స్వాగతం ఇవ్వడానికి ఏర్పాట్లు చేస్తూ వున్నారు.

# వీరేశలింగవర్ధంతి ఉత్సవం

## ఆంధ్రదేశమంతటా సభలు

బెజవాడ, మే 28 శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయంలో, స్థానిక అభ్యుదయ రచయితల సంఘ యాజమాన్యాన వీరేశలింగ వర్ధంతి నిన్న సాయంత్రం శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు గారి అధ్యక్షతన జరిగినది.

గిడుగు సీతాపతిగారు పంతులు గారితో గల పరిచయాన్ని స్మరిస్తూ ఇలా ఉపన్యసించారు. "ఆరోజుల్లో, ఏ కొంచెమో చదువుకున్న ప్రతిగృహంలోను, వీరేశలింగంగారి పుస్తకాలు చదువని స్త్రీలే వుండి యుండరనటం అతిశయోక్తి కాదు. పంతులుగారంటే ఒక చిన్న విజ్ఞాన సర్వస్వం. ఆయన శైలిలో ఎట్టి వొడుదుడుకులున్నూ ఉండదు. ఆయన పండితులకూ పామరులకున్నూ తెలిసే సులభశైలిలో వ్రాశారు.

"మలం పేరిట దురాచారాలు విచ్చలవిడిగా సంఘంలో ప్రవేశించి సంఘ పతనానికి ఎలా కారణభూతం అవుతున్నదీ గమనించి, వీరేశలింగంగారు చమత్కారంతో సంఘసంస్కరణదృష్టితో సాహిత్య సృష్టికి పూనుకున్నారు. పంతులుగారు సాధారణమైన ఒక కాలేజీ తెలుగు పండితుడు మాత్రమే. కాని నిర్భయంగా సంఘ దురాచారాలను అరికట్టేందుకని కంకణం కట్టుకుని వారు కృతకృత్యులు కాగలిగినారు.

"పంతులుగారు గోదావరి ఒడ్డుకు వెళ్లి అమ్మలక్కల సంభాషణలు విని, ఆ వాడుక భాషనే తన ప్రహసనాల్లో చాలా నేర్పుతో ప్రయోగించేవారు. అందుచేతనే వారి ప్రహసనాలలో సహజత్వం ఎక్కువగా స్ఫురిస్తుంది.

"పరిస్థితులు ప్రతికూలంగా వున్నప్పటికీ ఆయన జంకి వెనక్కు తగ్గలేదు.

"ఎన్ని అడ్డంకులు వచ్చినా ఆయన లొంగిపోలేదు. బాల్యవివాహాలు తప్పని నమ్మేరు, విధవావివాహాలు న్యాయసమ్మతమని నమ్మేరు. కేవలం ఆర్షమైన బ్రహ్మమతం ఆయనకు నచ్చింది. వారు దాన్ని స్వీకరించారు.

"పంతులుగారి వాఙ్మయసేవ అపారం. వారు మొదట పాండిత్య ప్రదర్శనాలు చేయకపోలేదు. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం వ్రాశారు. కాని ఆపైన ప్రజానీకానికి ఉపకరించే సులభశైలిలో రచనలు చేయసాగేరు.

"పంతులుగారు వార్ధక్యంలో కూడా పట్టుదలతో వ్రాస్తూవుండడం చూచి ఆశ్చర్యచకితులుగాని యువకులు లేరంటే అతిశయోక్తి కాదు. ఆంధ్రదేశం త్వరలో వీరేశలింగంగారి జన్మదిన శతాబ్ద్యుత్సవాలను దిగ్విజయంగా జరుపగలదని ఆశిస్తున్నాను."

ఆటుపిమ్మట విజయవాడ భారత మహిళామండలి అధ్యక్షురాలు శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు ఉపన్యసించారు. వీరేశలింగం పంతులుగారు ఆంధ్ర మహిళామణులకు చేసిన ఉపకారం నిరుపమానమైంది. పూర్వం శ్రీ కృష్ణుడు సంఘ సంస్కర్త యని నా అభిప్రాయం; అట్లాగే యీనాడు పంతులుగారుకూడా పతనమైపోతూన్న సంఘాన్ని ఉద్ధరించేందుకు సంస్కరణోద్యమం ప్రారంభించారు. "అదలించి యెరుగని, బెదరించి యెరుగని" మహాత్ముడు స్వార్థత్యాగియై దేశం కోసం తన సర్వస్వం ధారపోస్తూ వున్నట్లు ఆనాడు మన ఆంధ్రనారీ లోకోద్ధరణార్థం వీరేశలింగం పంతులుగారు పాటుబడ్డారు. వారు సంఘంలో వున్న కుళ్లును కడిగివేయడానికి జీవితసర్వస్వాన్ని సమర్పించిన సన్యాజీవులు."

పిదప శ్రీ సి. వి. కృష్ణారావు గారు పంతులుగారి సాహిత్య సేవను ప్రస్తావించారు.

తదుపరి సభాధ్యక్షులు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు, పంతులుగారు చిరస్మరణీయులనీ కడచిన యాభై సంవత్సరాల సారస్వత చరిత్రకు సూత్రధారులనీ అన్నారు. "ఆంగ్ల వ్యామోహంలోనుంచి లేప్పించి, ఆంధ్రుల దృష్టిని స్వభాషపైపునకు మరల్చిన మహానుభావుడు.

"సత్యరాజ పూర్వదేశయాత్రలు', 'రాజశేఖర చరిత్ర' అనే గ్రంథరాజాలు మేలిమివైనా, మెలితిరిగినవైనా వుంటాయి. పైకావ్యాలలో పంతులుగారు అరవై సంవత్సరాలనాటి సంఘ పరిస్థితులను ఎంతో చక్కగా ప్రతిబింబింపజేశారు. సాహిత్యక్షేత్రంలో పంతులుగారు త్రొక్కనటువంటి త్రోవలేదనే నా అభిప్రాయం. వారి కవులచరిత్ర చదవగా నాకు సాహిత్యాభిరుచి కలిగింది. ఆయన అన్నింటికంటే ముఖ్యంగా వ్యక్తిస్వాతంత్ర్యాన్ని నిలబెట్టడానికి పోరాడిన మహాయోధుడు. ఆ మూర్తిని ఆంధ్రులమైన మనం ఎన్నటికీ మరువలేము."

సభాంతమున శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు అధ్యక్షులకున్నూ, శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ కమిటీవారికిన్నీ కృతజ్ఞతాభివందనాలు తెలిపినారు.

క్షేమవరం. మే 30: జోస్యుల అచ్యుత రామయ్యగారి అధ్యక్షతను వీరేశలింగ వర్ధంతి సభ జరిగింది. రాయసం వెంకట్రామయ్య, పెద్దాడ రామచంద్రరావు, ఎం. వి. కృష్ణరావు మొదలయినవారు ఉపన్యసించారు.

# పంచగనిలో గాంధిజీ

## మౌనంరోజులు ఉండాలని సంకల్పం

(మా ప్రత్యేక విలేఖరి)

పంచగని, జూన్ 1: నిన్నరాత్రి పంచగని విచ్చేసిన మహాత్ముడు సువిశాలమైన దిల్‌ఖుష్ బంగళా ఆరోగ్యభవన ఆవరణలో నేటి సాయంకాలము తన ప్రథమ ప్రార్థనలు జరిపెను. మహాత్ముడు వచ్చెననువార్త పర్వతముల పైవిలసిల్లుచున్న ఈచిన్న పట్టణమంతట శీఘ్రగతిని వ్యాపించెను. మహాత్ముని దర్శనము గావించుటకును, ప్రార్థనలలో పాల్గొనుటకును, అధిక సంఖ్యాకులుగా ప్రజలు వచ్చిరి. ఈ మహాజనము నుద్దేశించి, జాతీయ పోరాటము సాగించుటకుగాను ఆరోగ్యమును, బలమును అభివృద్ధిచేసికొనుటకై తానిచ్చటకి వచ్చెనని మహాత్ముడు చెప్పెను. స్వకీయ సమస్యలతో తన్ను వేధింపవలదని మహాత్ముడు వారిని వేడెను. 'భగవంతునిసంకల్పమేమో తెలియదుగాని, ఒకమాసము రోజులు యిచ్చట వుండ వీలగునని ఆశించుచున్నాను' అని మహాత్ముడనెను. రాజకీయ పరివర్తనలవల్ల యితర ప్రదేశములకు వెళ్లవలసి వచ్చు అవకాశమును మనమునందుంచుకొని మహాత్ముడిట్లు చెప్పియుండునని రాజకీయ పరిశీలకులు తలచుచున్నట్లున్నది.

### భారత సమస్య విషయమై మెహతబ్ అభిప్రాయం

ఇప్పుడిచ్చటనున్న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులు హరికృష్ణ మెహతబ్ గారు గాంధిమహాత్మునితో చర్చించుచున్నారు. భారత ప్రతిష్టంభనా పరిష్కారము విషయమై బ్రిటిషు ప్రభుత్వమువారు గావింపగల యేసూచననైనను అంగీకరించుమని కాంగ్రెసువారు ముందుగా ప్రకటింపవలెనని కొంతమంది దక్షిణదేశ నాయకులు వెలిబుచ్చు అభిప్రాయముతో శ్రీ మెహతబ్ గారు ఏకీభవించుచున్నట్లు కనబడదు. 'ప్రస్తుత పరిస్థితులని ఆమూలాగ్రంగా పరిశీలింపవలసిన ఆవశ్యకత కలదు. కాని నిరాశ, నిస్పృహలలోనైన బ్రిటిషు ప్రభుత్వమువారు అనుగ్రహించి కనికరించి యిచ్చు దేనినైనను సరే అంగీకరించు సంసిద్ధతను ముందుగా కాంగ్రెసువారు ప్రకటింపవలసిన కారణమేమియులేదు. ఇట్టి ప్రకటన కాంగ్రెస్ బలమును హెచ్చింపదు. భారతజాతి ప్రతిష్ఠను హెచ్చింపదు. ప్రతిసూచనను దాని గుణాగుణములను బట్టి, మంచి చెడ్డలను బట్టి పరిశీలించవలెను. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు గాంధిమహాత్మునితో ఆలోచించి తీర్పు చేయుదురని తలపవచ్చును.' అని శ్రీ హరికృష్ణ మెహతబ్ గారు అభిప్రాయ పడుచున్నారు.

# వార్తావళి

రాజమండ్రి, మే 31: మునిసిపల్ సంఘసమావేశము మే 29 న శ్రీ ఎం. వెంకట్రావు (చైర్మన్) గారి అధ్యక్షతను జరిగింది. లోగడ 10 సం|| చైర్మన్ గా పనిచేసిన కీ|| శే|| మాదిరెడ్డి వెంకటేశ్వరరావునాయుడుగారి ఛాయా పటాన్ని మ్యూనిసిపల్ హాలులో బహిర్గతం చేయ తీర్మానించారు.

## వార్షికోత్సవం

క్షేమవరం, మే 30: యు. ఎల్. సి. ఎం. హైస్కూలు వార్షికోత్సవం ఈ 26 న కె. చంద్రపాల్ గారి అధ్యక్షతను జరిగింది. వాడ్రేవు వెంకటనరసింహశాస్త్రి (రిటైర్డు తెలుగు పండితులు) గారిని సన్మానించారు.

## శారదా నికేతనం

గుంటూరు శారదా నికేతనం జూన్ 15 నుంచి మరల మొదలగును. చేరదలచినవారు దరఖాస్తు చేసుకొని ప్రారంభ దినానే చేరవలెను. విద్యాభ్యాస వివరములు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ గారికి వ్రాసి తెలుసుకోవచ్చును.

## స్వయంసేవకులకు వీడ్కోలు

మద్రాసు విద్యార్థుల తరఫున, ఆంధ్ర విద్యార్థి ఫెడరేషను తరఫున ఉత్తర విశాఖలో సేవార్థం పోయిన స్వచ్ఛంద సేవకులు స్వస్థానాలను తిరిగి పోయేముందు మే 29 న నౌపడాలో చెన్నూరు నారాయణరావుగారు టీ పార్టీ చేశారు. అనంతరం హెచ్. కె. చక్రవర్తిగారి అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో సి. నారాయణరావు, డా|| యం. వి. రామారావు, కె. గోవిందరావు మున్నగువారు వీడ్కోలు చెప్పారు. బాలకృష్ణన్ గారు జవాబు చెబుతూ ఉత్తర విశాఖ ప్రజలు ఇంకా వైద్య సహాయం చేస్తూ ఉండకోరారు.

## ఉరిశిక్ష రద్దు

ముద్దవరం గ్రామ రెడ్డి సుబ్బారెడ్డిని చిత్రవధచేసి ఖూనీచేశారని బోయ ఎల్లుగాడు, మరి 4 గురిపైన కర్నూలు జడ్జి విధించిన ఉరిశిక్షను అప్పీలులో మద్రాసు హైకోర్టులో వాడ్స్‌వర్త్, క్లార్కు న్యాయమూర్తులు విచారించి సాక్ష్యంపల్ల సహేతుకంగా నేరం రుజువుకాలేదని ఉరిశిక్షను రద్దుచేశారు. మోక్షగుండం పల్నాటి రామిరెడ్డి, జయరామయ్యర్ గార్లు ముద్దాయీలతరఫున వాదించారు.

## యువకాంగ్రెసు

బాపట్ల, మే 30: తాలూకా యువజన కాంగ్రెసు యాజమాన్యాన వేదాంతం వాసుదేవరావుగారి అధ్యక్షతన జరిగిన బహిరంగసభ నంది కృష్ణమూర్తిగారి జాతీయగానంతో ప్రారంభమైనది. సభాధ్యక్షుడు అంతర్జాతీయ సందర్భాలు ముచ్చటించాడు. రాష్ట్ర యువ కాంగ్రెసు అధ్యక్షుడు వి. యల్. సుందరరావుగారు, యువ కాంగ్రెసు లక్ష్యవిధానాలు వివరించారు. జి. వి. సుబ్బరావుగారును ఉపన్యసించారు. సభానంతరం నంది కృష్ణమూర్తిగారు జాతీయ బుర్రకథ చెప్పారు.

### మార్కాపురం

ప్రసన్న రాములవారి ప్రతిష్ఠా మహోత్సవాలు జరిగినవి. స్వామివారి ఆలయం కొత్తగా కట్టినారు. (స్వ. వి.)

శ్రీ లక్ష్మీచెన్న కేశవస్వామి ఆలయాన్ని తిరుపతి శ్రీరంగక్షేత్రాలవలె నిర్మించాలని పురప్రముఖులు నిశ్చయించారు.

### వితంతు శరణాలయం

నర్సాపురం, మే 29: ఇచటి వితంతు శరణాలయ భవననిర్మాణం నిమిత్తము ఈ విరాళాలు లభించినవి:

అ. సత్యనారాయణ మూర్తిగారు, మోతే వెంకట సుబ్బారావుగారు చెరి రెండువేలు, జూపూడి కేశవరావుగారు వెయ్యి, జవ్వాది లక్ష్మయ్య, పసల సూర్యచంద్రరావు, కోటూరి వెంకటేశ్వర్లు, సుగ్గు గంగరాజు, మోతే నరసింహారావు, బొండాడ వెంకటరాజు గుప్తగార్లు చెరి 600 లును, యిమిడి చిన వెంకటశివయ్య, బంగారు విశ్వనాథం, యీ అప్పారావు గారలు చెరి 500 లును దానాలు చేశారు.

### గుంటూరుజిల్లా టెక్స్టైలు సలహా సంఘము

చీరాల, మే 30: గుంటూరుజిల్లాకు వచ్చే గుడ్డలకోటా సరఫరాకుగాను పి. వి. సుబ్బయ్యపంతులుగారి అధ్యక్షతను నిన్న సభజరిగినది. ముఖ్య ప్రదేశములలోని గుడ్డల కమిటీల అధ్యక్షులతో ఒక సలహా సంఘం ఏర్పాటైనది. యిందులో గుంటూరు ఇండియన్ చేంబర్సు ఆఫ్ కామర్సు ప్రతినిధిగూడా ఒకసభ్యుడు. జిల్లా టెక్స్టైలు కంట్రోలు ఆఫీసరు పి. వి. సుబ్బయ్యగారు అధ్యక్షులుగ ఎన్నుకొనబడిరి.

టెక్స్టైలు కంట్రోలు ఆఫీసరు గార్కి ఈ జిల్లా కోటా, జనసరి పంపకంలో సహాయముచేయుటకు ఒక ఉప సంఘమునూడ ఏర్పాటైనది.



# రాష్ట్ర స్వాస్థ్యం

## మంచినీటి సౌకర్యం లేకపోవడమే కలరా కారణం

చీరాల, మే 29: గుంటూరు జిల్లా హెల్తు ఆఫీసరు డా|| వి. సోమసుందరం గారు రెండురోజుల నుంచి మకాంచేసి చీరాల పేరాల గ్రామములలోని ఆరోగ్య పరిస్థితులను తనిఖీ చేశారు. వారిని మా విలేఖరి నేడు ప్రశ్నింపగా ఇలా తెలిపారు.

జిల్లాలో వ్యాధులబాధ లేదు. కాని ఈ ప్రాంతములో వీరన్నపాలెం, గవిని పూడి, మరియొక గ్రామంలో కలరా కలదని అందుకు ప్రజలు మురికినీరు త్రాగటమే కారణమని చెప్పినారు. పరిశుభ్రమైన నీరు ప్రజలకు లభ్యమగునప్పుడే ఈవ్యాధిని అరికట్టవచ్చునని చెప్పినారు. వీరన్నపాలెంలో 8 గురికి కలరా తగిలి ఆరుగురు మరణించారు. తిరిగి కొత్తకేసులు లేవు.

గుంటూరుజిల్లా హెల్తు ఆఫీసరు ఇలా విజ్ఞప్తి చేశారు. "రానున్న కృష్ణాపుష్కరాల సమూహం, సమావేశ సమయములలో కలరా సంభవించవచ్చును. టీకాలు ఉచితముగా వేయుటకు ప్రతి ఆసుపత్రిలోను, శానిటరీ ఇన్స్పెక్టరువద్దను తగు ఏర్పాటులున్నవి. యాత్రికు లందరు ముందుగా టీకాలు వేయించుకోవాలి.

### అంటువ్యాధులు

మార్కాపురంలో కలరా మశూచి కేసులు వారంపైగా లేవు.

### ప్లేగు

మదనపల్లెలో ఈ ప్లేగు మే నెలలో 19 మందికి సోకి, ఇద్దరు చనిపోయారు. ఫిబ్రవరినుంచి జూన్ 1 దాకా 43 గురికి సోకి 16 గురు చనిపోయారు. (స్వ. వి.)

### ఉబ్బసం చికిత్స

చీరాల, మే 30: ఆయుర్వేద వైద్యులు పనప్పాకం సుబ్బరాయ ధన్వంతరిగారు ఉబ్బసవ్యాధి నివారణకు నూతన చికిత్స కనిపెట్టినారు. ఖాళీగా వెంటనే నయము యిచ్చినది. వ్యాధి తిరిగి కనబడదు. అది కావలసినవారికి ఉచితముగా యివ్వబడును.

ముంగానిపల్లె హరిదాసు కోనకుంట్లలో సనాతన వేదాంత జ్ఞానానంద మహాసభ జి. యం. చెట్టిగారి అధ్యక్షతన మే 25 నుంచి 27 వరకు జరిగినది.

# ఉత్తరాలబట్వాడాలో చాలా ఆలస్యం

## చీరాల పౌరుల ఇబ్బందులు: అధికార్లకు విన్నపం

చీరాల, మే 29: ఆర్. ఎమ్. యస్. డిపార్టుమెంటువారు బెజవాడనుంచి వచ్చు మెయిల్ బాగ్సు కలకత్తా మెయిలులో తీసుకొనిరాకుండా ఉదయం 7-30 గంటల వాల్తేరు ప్యాసింజరులో తీసుకొని వచ్చు ఏర్పాటు ఇటీవల చేసినారు. వాల్తేరు ప్యాసింజరు సాధారణంగా ఎంతో ఆలస్యంగా వస్తున్నది. ఆ బండికి వచ్చు మెయిలు బాగులోని ఉత్తరాలు సగైరా మరునాడు బట్వాడాచేస్తున్నారు. ఈవూరు రెండు మెయిల్లు, రెండు ఎక్స్‌ప్రెస్‌లు ఆగే ముఖ్యవర్తక కేంద్రస్థానము. అధికారులకు విజ్ఞప్తులు చేసుకోగా జిల్లా పోస్టల్ సూపరింటెండెంటు గూటాల వెంకటసుబ్బారావుగారు ఈరోజు మకాం చేశారు. పత్రికా రచయితల సంఘ కార్యదర్శి నేడు సందర్శించి పై విషయములో ప్రజలకు కలుగుచున్న యిబ్బందులను విశదపరచి ఏరోజు ఉత్తరాలు ఆ రోజు బట్వాడా చేయించవలెనని కోరారు. సాకల్యముగా విని, యుద్ధపరిస్థితులవల్ల యిట్టి అసౌకర్యము ఏర్పడినదని తెల్పి అందరు కొంతకాలము ఓపిక పట్టవలసినదని సూపరింటెండెంటు చెప్పారు. తాను పై అధికారులకు తెలుపుతామన్నారు.

## మ్యునిసిపాలిటీ అవసరం

సాయంకాలము తేనీరు అనంతరం బహిరంగ సభ జరిగినది. ఒంగోలు ఆసుపత్రి మెడికల్ ఆఫీసరు డాక్టరు శింగరాజు సుందరరాజనుగారు ఉపక్రమిస్తూ పాత విద్యార్థుల సమావేశ ఆదర్శములు వివరించారు. కార్యదర్శి మద్దుకోటేశ్వరరావుగారు వార్షిక నివేదిక చదివి వినిపించారు. స్థానిక హైస్కూలు మ్యునిసిపల్ పరిపాలనలోకన్న జిల్లాబోర్డు పరిపాలనలో పౌరులు విశేషము లబ్ధినను ననుకొంటున్నదనియు యిందుకు ఈ వూరిని తిరిగి మ్యునిసిపాలిటీ చేసి స్కూలును మ్యునిసిపల్ పరిపాలనకు అప్పగిస్తేనే తిరిగి అభివృద్ధి చెందగలదనిన్నీ కాంగ్రెసువారిపట్టు సన్నగిల్లినది గనుక పౌరుల ఆరోగ్య సౌకర్యములకును హైస్కూలు అభివృద్ధికిని వెంటనే మ్యునిసిపాలిటీని తిరిగి ఏర్పాటు చేయమని ప్రభుత్వమువారిని విశేషముగా కోరినారు. తరువాత...

## పాత విద్యార్థుల సభ

చీరాల, మే 29: హైస్కూలు ప్రాత విద్యార్థి సంఘము వార్షికోత్సవము నిన్న కొప్పెల నారపరాజు శ్రీధరరావుగారి అధ్యక్షతను జరిగినది. ఉదయం కార్యనిర్వాహకసభ సంఘ అధ్యక్షులు గుగ్గిలం పున్నయ్యగారి అధ్యక్షతను జరిగినది. వచ్చే సంవత్సరానికి మద్దు సుబ్బారావుగారు అధ్యక్షులుగను, కె. గోవిందరాజులుగారు కార్యదర్శిగను గుంటూరు కృష్ణమూర్తిగారు కోశాధికారిగను, ఎన్నుకోబడినారు. చీరాలలో మరియొక వ్యవసాయ కళాశాలను ఏర్పాటు చేయమని ప్రభుత్వమువారిని కోరుతూ తీర్మానించారు. విద్యార్థులకు విద్యసహాయం చేయ తీర్మానించుకున్నారు.

### కాకినాడ

తూర్పు గోదావరిజిల్లా మెడికల్ అసోసియేషన్ కాకినాడలో మే 26 వ తేదీని సమావేశమయింది. లెఫ్టినెంటు మిస్. బి. సింగ్, డా|| ఐ. జోగారావుగార్లు కొన్ని ప్రత్యేక వైద్య చికిత్సలనుగురించి ఉపన్యసించారు. (స్వ. వి.)

### సాయిబాబా హైస్కూలు

అనంతపురం, మే 30: క్రొత్తగా రికగ్నిషన్ లభించిన సాయిబాబా నేషనల్ హైస్కూలు నిర్వాహక సంఘం మొన్న ఏర్పాటైనది. యం. లక్ష్మీనారాయణరావుగారు అధ్యక్షుడుగను, కె. యస్. రాఘవాచార్యులుగారు కోశాధికారిగాను, యస్. ఆదినారాయణరావుగారు కార్యదర్శిగను ఎన్నిక అయినది.

పి. రాఘవేంద్రాచార్యులు, ఎం. ఏ. యల్. టి గారిని హెడ్మాస్టరుగా నియమించారు. జూన్ 7 న స్కూలు మొదలగును.

పలువురు యీ విషయాలను బలపరుస్తూ ముచ్చటించారు. హాస్యవేషాలు; చౌడప్ప నాటకం ప్రదర్శించిన పిదప వందన సమర్పణతో సభ ముగిసినది.

# రైతాంగ విద్యాలయం

## 175 మంది విద్యార్థులు తయారైనారు

నిడుబ్రోలు, మే 31: రైతాంగ విద్యాలయ వార్షికోపన్యాసం ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెసు ఎసెంబ్లీ అధ్యక్షుడు కల్లూరి చంద్రమౌళిగారు చేస్తూ, కేవల రాజకీయ స్వరాజ్యమే చాలదు; ఆర్థిక స్వాతంత్ర్యంకూడా కావలెనన్నారు.

ఈ కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్య విద్యాపీఠంలో చదువుతున్న 175 మంది విద్యార్థులు కాంగ్రెస్ ఎసెంబ్లీకి, కిసాన్ విద్యార్థి మహిళా కాంగ్రెసులకు అప్పగింతలు చేస్తూ ఈ పిన్నవారందరూ గాంధీవిధానమందేను, కాంగ్రెసు లక్ష్యమైన కిసాన్-మజ్దూర్ ప్రజారాజ్యమందేను భక్తిశ్రద్ధలు కలవారిని విద్యాపీఠ ప్రధానాధ్యాపకులు రిటాన్. జి. రంగాగారు చెప్పారు. గాంధీజీ మన సుకృతంవల్ల ఇంకా భూమిలో ఉన్నారు కనుక వారి ఉపదేశాలను మీ కేవలం వ్యాఖ్యానించనక్కర్లేదు. నిరంతరం పెంపొందుతున్న గాంధీ విధానాన్ని ఆచరించటానికి జాతీయ కాంగ్రెసు, దానితోబాటు వర్గకాంగ్రెసులు కావలెనన్నారు. బాబురావుగారు, ఈద్పగంటి వేంకటరత్నమాంబగారు, భారతదేవిగారుకూడా ఉపన్యసించారు.

చంద్రమౌళిగారి ఉపసంహార వాక్యాలతో స్నాతకోత్సవం ముగిసింది.

## ఎగువ పెన్నార్ ప్రాజక్టు వెంటనే ప్రారంభించాలి

### అనంతపురం రైతుసభాతీర్మానం

అనంతపురం, మే 30: జిల్లారైతు మహాసభ ముక్కామల నాగభూషణంగారి అధ్యక్షతన 26 తేదీన బుక్కపట్నంలో జరిగినది. 75 పల్లెలనుండి రైతాంగము స్త్రీలుకూడా తెంచవచ్చి కష్టనిష్ఠూరాలు చెప్పించుకున్నారు.

రాటకొండ నరసింహారెడ్డిగారు జంగా వర్గద్వేషమే గాని కాంగ్రెసు వ్యతిరిక్తం కాదన్నారు.

వావిలాల గోపాలకృష్ణయ్యగారు సభను ఉపక్రమిస్తూ ఐక్యతే అవసరమన్నారు.

సహకారయుతు పోటీసంఘాలు కూడదని, ఈజిల్లాలో పోటీసంఘాలకు వీలులేకుండా చేయవలెనని ఉపన్యాసక్రమంలో తెలిపారు.

జిల్లా రైతాంగమునకు సంబంధించి చాలా తీర్మానాలు చేశారు.

యుద్ధానంతరం చేయదలచిన ఎగువ పెన్నార్ ప్రాజెక్టు పని వెంటనే ప్రారంభించగోరినారు.

కరువుబాధలు పడుతున్న ధర్మవరం తాలూకా గ్రామాదులకు శిస్తురిమిషన్ ఇవ్వవలెననీ ధర్మవరం కల్యాణదుర్గం తాలూకాలలో కరువుపనులు మొదలు పెట్టవలెనని ప్రభుత్వాన్ని కోరారు.

ఉల్లిగడ్డలు, వేరుశెనగ ధరలను రు. 11 కు, 2-8-0 కు ఏర్పరచవలెనని, ప్రభుత్వం వారు విధించినధరకే పత్తి కొనిపించవలసిందని కోరారు.

## మ్యునిసిపల్ చెర్మన్‌పైన ఆరోపణలు

బందరు, మే 31: మ్యునిసిపల్ చైర్మన్ తన అధికారాన్ని దుర్వినియోగం చేశారనీ; జిల్లా మ్యునిసిపాలిటీల ఆక్టు 40 వ సెక్షన్ ప్రకారం వారిని పదవినుండి తొలగింపవలసిందనీ కోరుతూ తుర్లపాటి వెంకటేశ్వరరావు (కౌన్సిలర్)గారు పంపిన అర్జీని, బెజవాడలోకల్ బోర్డు మ్యునిసిపాలిటీల డెప్యూటీ ఇనస్పెక్టరు నిన్న విచారణచేసినారు. విచారణకాలమందు హాజరుకావలెనని తెలియపరచినా చైర్మన్ రాలేదనీ, మ్యునిసిపల్ కమిషనర్, మ్యునిసిపల్ ఆఫీసు మేనేజర్లు ఎదుట విచారణ జరిగిందనీ, విచారణకు కావలసిన కొంత రికార్డును డిప్యూటీ ఇనస్పెక్టరు కోరగా ఆఫీసువారు కనబడటంలేదని చెప్పారనీ తెలుస్తున్నది. డెప్యూటీ ఇనస్పెక్టరు, చైర్మన్‌కు అర్జీ నకలును పంపి, వారంరోజులలోగా సమాధానం తెలుపుకో గోరారు.

కాకినాడ ఆంధ్రసేవాసంఘం,

పేద విద్యార్థిపృద్ధి మొదలుగు దేశకళ్యాణకరమైన ధర్మకార్యాచరణ చేస్తూ చాలా సేవచేయగలిగిన దీసంఘం. కాని కొన్నిఏండ్లుగా దీనికార్యక్రమాలు సంప్రాప్త ముగానే తగ్గింది. తిరిగి చేతులుత్తేందుకు తగిన ఏమైనంది పెద్దమనుష్యులు 18 మాసముల క్రితం దరకాస్తులు పెట్టారు. మెంబర్లనియ్యంగకు యిచ్చేవరకూ మంజూరు కాలేదు. మెంబర్ల నామ వ్రాతల లెక్క చేయటం తగ్గించేరు. మెంబర్లే సర్వసభ్యసభా వేళం ఎన్నికలుకూడా జప్పుతారట.

# పట్టణ వార్తలు

## భాగవతర్, కృష్ణన్ల అప్పీలు

### సెలవల ఆఖరున నస్తుంది

చెన్నపురి, జూన్ 1: లక్ష్మీకాంతం కేసులో యావజ్జీవ శిక్షపడిన త్యాగరాజ భాగవతర్, కృష్ణన్లు అప్పీలు దాఖలు చేసుకోవటానికి, న్యా॥ వాఢ్వ వర్గ, న్యా॥ క్లార్కుగారలను నేడు అనుమతి కోరగా ప్రతివాదులకు నోటీసును జారీ చేస్తూ అప్పీలు అక్టోబరుమాట సెలవల అనంతరం విచారించవలెనని ఉత్తర్వు వేశారు. కఠినశిక్ష తొలగించవలెనని కోరగా ఊరికే కూర్చోటంకన్న పనిచెయ్యటమే వంటికి మంచిదని కోర్టువారన్నారు. జామీను నిరాకరించారు. వి. టి. రంగస్వామిగారు అప్పెలెంట్ల తరపు హాజరయ్యారు.

కూరగాయల విత్తుల పంపకం.

చెన్నపట్టంలో బీదరైతులకు ఉచితంగా విత్తులూ, ఎరువులూ పంచిపెట్టడానికి ప్రభుత్వంవారు ఒకడిపో తెరిచారు. 8 జిల్లాలలో అదనపు ఉద్యోగులను వేశారు. జనవరి, ఫిబ్రవరి, మార్చి మాసాల్లో పట్టం ఆఫీసుకు వచ్చి 15,000 వచ్చి ఈ అవకాశాన్ని ఉపయోగించుకున్నారు. పట్టంలో రూ 2,500 విత్తులు అమ్మారు. పట్టంలోనూ చుట్టుపట్లా రూ 200 ల విలువగల కూరగాయల విత్తులు వేరుశెనగ పిట్టూ ఉచితంగా పంచిపెట్టారు. కూరగాయల ప్రదర్శనాలను 60,000 మంది చూశారు. 4,000 పాకెట్లు ప్రదర్శనాల్లో అమ్మారు.

ఈ మూడు మాసాల్లో జిల్లాలలో 1300 ఎకరాల్లో కూరగాయల సాగు పెరిగింది. 1500 పౌన్లు విత్తులు ఉచితంగా పంచారు. కూరగాయలు పైరు చెయ్య కుతూహలపడే వారందరికీ వ్యవసాయ శాఖవారు సహాయ పడతారనీ, ఇదంతే సస్యాభివృద్ధి కార్యక్రమం క్రింద జరుగునని మద్రాసు ప్రభుత్వ ప్రకటన చెబుతోంది.

పిల్లలక్కు, పిల్లతల్లులకు పాలు

పట్టంలోని రెండేళ్లలోపు పిల్లలకూ మాలింతలకూ, బాలింతలకూ, మాతృశిశు రక్షణాలయాల ద్వారా (కార్పొరేషనులో) పాలు పంచటానికి మద్రాసు ప్రభుత్వంవారు నిశ్చయించారు. గర్భిణిలో ఉన్నప్పుడు ఆరుమాసాలు పురుడువచ్చాక రెండుమాసాలు పాలు ఉచితంగాఇస్తారు. గవర్నమెంటు గ్రాంటు వస్తుందనే ఆశతో కమిషనరు ఓక్కొక్కచోట 250 శేర్ల పాలు చొప్పున 5 చోట్ల ముందు పంచిపెడతారు. సహకారసంఘ (పాల) యూనియన్ ద్వారా రోజుకు 1,500 శేర్ల పాలు అవసరమని రిపోర్టిరు చేసిన స్కీమును ప్రభుత్వంవారామోదించారు. పాల సహకార సంఘాలకు పశువులు కొనటానికి ఒకలక్ష 20 వేలు వడ్డీలేని అడ్వాన్సు ఇస్తారు.

హిందీప్రచార సభాప్రశంస

డా॥సయ్యద్ మహ్మూద్‌గారు జూన్ 1 తే దక్షిణ భారత హిందీ ప్రచారసభను సందర్శించారు. శ్రీ బద్రు జగన్నాథదాసుగారు, మోటూరి సత్యనారాయణగారలు స్వాగతమిచ్చారు. డా॥ సయ్యద్ మహ్మూద్ గారు ద॥ భా॥ హిందీ ప్రచార సభవారు ఉర్దూహిందీ సమస్యను చక్కగా పరిష్కరించి ఉత్తరాదివారికి ఆదర్శమార్గం చూపారన్నారు. శ్రీ మోటూరి సత్యనారాయణగారు హిందూస్తానీ సమావేశమప్పుడు వార్ధాలో చేసిన ఉపన్యాసాన్ని అంతా యుక్కవగా ప్రశంసించారన్నారు.

జీవనసూచిక

చెన్నపట్నంలో మే 26 తేదీతో ఆఖరయ్యే వారంలో కార్మికుల జీవనసూచిక 222 దగిరే ఉండిపోయింది.

## అగ్నిదాహం

### (స్వకీయ విలేఖరి)

విశాఖపట్నం, మే 28: గొల్లవీధిలోని సుమారు నలుబది నాలుగు యిండ్లు మే 25 న తగులబడినవి. ఆ కుటుంబీకులకు ఈ సందర్భమున ఒకపూట శ్రీ మార్గాని సూర్యనారాయణగారున్ను, రెండవపూట శ్రీ అద్దేపల్లి నాగరాజు బ్రదర్సువారున్ను చెరివకయాబది రూపాయలు ఖర్చుపెట్టి ప్రేమసమాజంవారి యాజమాన్యమున భోజనము లిప్పించిరి.

## న్యూయార్కు దూదిమార్కెటు

న్యూయార్కు, జూన్ 2:

న్యూయార్కు దూది; జూలై 22.97/22.98 అక్టోబరు 22 66/22.66 డిసెంబరు 22.55/22.55 జనవరి 22.52 / 22.52 మార్చి 22.46 / 22.48 మే 22.41 / 22.41 జూలై 22.28 / 22.28 అక్టోబరు 21.54 / 21.54 డిసెంబరు ...

| | |
|---|---|
| బిడ్లింగ్ హౌజరు | 23.45 |
| అక్టోబరు (గరిష్టధర) | 22.69 |
| (కనిష్టధర) | 22 65 |

# బర్మాలో మిత్రబలాల గొప్ప విజయాలు

## శత్రుసేనల మొండి ప్రతిఘటన

క్యాండి, జూన్ 2: బర్మాయుద్ధ రంగమున అన్నిచోట్లలో బ్రిటిష్ భారతీయ సైనికులు గొప్పవిజయాలు సాధించారని ఏ. పి. ఐ. యుద్ధవిలేఖరి మైకెల్ మాగ్రోనా వ్రాస్తున్నాడు.

వేర్వేరు స్థలాలలో చిందర వందరగా చీలిపోయియున్న జపాను సేనలు మిత్రబలాల రక్షణలను ఛేదించుకొని తూర్పు బర్మాలోకి తప్పుకొనిపోవటానికి పలుచోట్లలో బలమైనదళాలుగా చేరి యత్నిస్తున్నారు. చెదరిపోయిన శత్రుబలాలు కొన్నిచోట్లలో చేరుచుండుటవల్ల వారిని హతమార్చటానికి మిత్రబలాలు అడవులు కొండప్రదేశాలను వెదకవలసిన అగత్యం లేకపోవుచున్నది.

గతవారంలో శత్రుసైన్య ముతాల సంఖ్యలు పెరిగినందున వారి ప్రతిఘటన కూడా హెచ్చింది. కామా అనేస్థలంలో మిత్రబలాల శ్రేణిని ఛేదించుకొని పోవటానికి 3000 శత్రుసైనికులు ప్రాణాలపై ఆశవదలుకొని యత్నించిన విసముననే శత్రుసైనికులు పలుస్థలాల్లో ఆవేశంతో పోరాడుచున్నారు.

కాలా సోపానమనే స్థలమును మిత్రబలాలు పట్టుకోగలిగినందున బర్మాలో కొంత గుర్గము మైన స్థలమును దాటగల్గినారు. ఈకాలా సోపానాలు 3000 అడుగుల ఎత్తువరకు అక్కడి కొండలకును పాక్ మెట్టుభూములకు మధ్యనున్నవి. ఇక్కడ పోరాటం అతి దుర్ఘటముగా నుండినది.

ఐరావతి తూర్పున శత్రువుకు ఓటమి

ఐరావతి తూర్పున ప్రోమెకు 17 మైళ్లు ఉత్తరాన కామాపలాయనమార్గంవద్ద మన సేనలు శత్రువును గొప్పఓటమి విధించారు. ఇక్కడ 1221 మంది శత్రు సైనికులు హతులైనారు.

టంగూమావ్చి రోడ్డులో మనవారు శత్రుసేనలను పాక్ కొండలలోకి మరికొంత దూరం తరిమివేశారు.

సముద్రం సింగుశాఖలో సటాహిచ్ అనే శత్రునౌకా స్థావరం మీద మిత్రవిమానాలు నిన్న దాడి జరిపెనవి. ఒక శత్రు వర్తకనావ మునిగినది. బ్యాంగ్‌కాక్ సింగపూరు రైలుమార్గం మీదకూడా దాడులు జరుపబడెను. (అ. ప్రె.)

## 31,946 మంది ఎస్. ఎస్. ఎల్. సి. విద్యార్థులు

1945 సం॥లో ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకు 31,946 మంది హాజరయ్యారు. ఇందులో 2,772 ఆడపిల్లలు 491 స్కూళ్ల పిల్లలు 441 సెంటర్లలో పరీక్షకు కూర్చున్నారు. 30,844 మందిని పరీక్షించారు. 29,118 మంది విశ్వవిద్యాలయ కోర్సుకు అనువైన విషయాలు తీసుకున్నవారు. వీరిలో ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు 8,603 మంది మద్రాసు విశ్వవిద్యాలయం వారు 20,515 మంది ఉన్నారు. వీరిలో ఆంధ్ర ప్రాంతంలో 3,794 మంది మదరాసు విశ్వవిద్యాలయంలో 12,363 మంది విశ్వవిద్యాలయ కోర్సులకు అర్హులుగా ప్రకటించబడినారు.

కంప్లీటు చేసిన ఎస్. ఎస్. ఎల్. సి. ల పుస్తకాలు స్కూళ్లకు జూను 10 వ తేదీ ప్రాంతాల చేరుతాయి.

వివాహము

మధుర, మే 30: రంగునూలు వర్తకులును, మద్రాసు అరాన్ కో ప్రొప్రయిటరును అగు శ్రీ యం. కె. సుందరరామయ్యరుగారి కుమారుడు దేవదాసునకును, మధుర సౌరాష్ట్ర ప్రముఖులలో నొకరగు కె. యస్. శేషయ్యరుగారి చెల్లెలు ధనలక్ష్మికిని మే 25 న వివాహము జరిగినది. ఒ. వి.

## మదరాసు రేడియో

జూన్ 5 మంగళవారం

(వి. యు. యం. 211 మీ.) ఉ॥ 8-30, సా॥ 5.30 టి. యస్. జ్ఞానాంబాళ్. మ॥ 2-10 యస్. ఆర్. చెనెగల్. మ॥ 2.30 కళ్యాణి పద్మనాభన్. మ॥ 3.0; సా॥ 4.30 ఆర్. ఆర్. మూర్తి. రా॥ 8.0 టి. కృష్ణ అయ్యంగారు. రా॥ 10.0 రికార్డులు.

మదరాసు 2. ఉ॥ 7.40; మ॥ 2-5 తెలుగులో వార్తలు. సా॥ 6.50 పూర్వరంగం తెలుగులో భమిడిపాటి కామేశ్వరరావు నాటకం. సా॥ 7.30 తెలుగులోవార్తలు. 7.45 గ్రామీయులకు తెలుగులో ప్రసారం.

* * *

## తిరుచినాపల్లి రేడియో

సా॥ 5.0 టి. యస్. కుట్టలింగంపిళ్లై సా॥ 6.0 పి. ఆర్. యస్. మణి (మురళి) రా॥8.0 మదరాసులోవలె రా॥10.0 రికార్డులు.

# అన్నిమతముల పరమార్థము ఒక్కటే

## మహాత్ముని ధర్మోపన్యాసము

పంచగని, జూన్ 2: నేటిసాయంకాల ప్రార్థనలను గాంధిమహాత్మునకు బట్టా పార్సీ బాలికాపాఠశాలలో జరిపెను. పాఠశాల బాలికలు పాడిన ఒక పార్సీగీతము మహాత్ముని తన్మయుని గావించెను.

'భగవంతుని శరణు వేడినయెడల మేలు తప్ప అన్యమేమియులేదు. భగవంతుని యిచ్ఛామాత్రమున మునిగిపోవుచున్న వాడు సైతము రక్షింపబడును.' అని ఈగీతము యొక్క అర్థమని మహాత్ముడు చెప్పెను. ఇది, హిందువుల పురాణములయందలి గజేంద్రమోక్షణకథను జ్ఞాపకము చేయుచుండెననిన్ని, అన్ని మతముల గమ్యస్థానము ఒకటేనని యిందువల్ల మనము నీతి నేర్చుకొనవలసి యున్నదనిన్ని మహాత్ముడు చెప్పెను.

ప్రార్థన జైనతరువాత హరిజననిధికి ద్రవ్యము సమర్పింపవలసినదని మహాత్ముడు కోరెను. (అ. ప్రె.)

'చేకాగితము వాడుడు'

పంచగని, జూన్ 2: 'చేతితో తయారుచేయబడిన కాగితమును మాత్రమే వాడుడు. ఇట్లు చేయవలసినదని మిమ్ములను కోరుచు'అని తెనపంపేకమునకై వచ్చిన మున్నురు కాశీ హిందూ విశ్వవిద్యాలయ విద్యార్థులకు నేడు మహాత్ముడు సలహానొసంగెను. ఈ విద్యార్థులు మహాత్ముని సంతకము నకై మిల్లులలో తయారైన కాగితాల పుస్తకములను యివ్వగా మహాత్ముడు పైవిధముగా సలహా నిచ్చెను. (అ. ప్రె.)

## అసఫాలీ ఆరోగ్యాభివృద్ధికై ప్రార్థన

న్యూఢిల్లీ, జూన్ 2: అసఫాలీగారి సతికి ఆరుద్రా నెల్లడించుచునట్టియు, త్వరలో వారు తొల్లింటి ఆరోగ్యము బడయుగాక యని భగవంతుని ప్రార్థించునట్టి తీర్మానము నొకదానిని నేడిచ్చట జరిగిన మహాసభవారు గావించిరి. సభ గాంధీమైదానములో జరిగెను. జమైతుల్ ఉలేమా హింద్ ఉపాధ్యక్షులగు మౌలానా అహమ్మద్ సయ్యద్‌గారు అధ్యక్షతవహించిరి. జబ్బుగానున్న భర్తకు ఉపచారము చేయవీలగుటకుగాను శ్రీమతి అరుణ అసఫాలీ సతిపై జారీచేసిన అరెస్టువారంటును ఉపసంహరించుకొనవలసినదని సభవారు ప్రభుత్వము నకోరిరి. అ. ప్రె.

## పండిత నెహ్రూకు ద్రవ్య సమర్పణము

### ఇంగ్లండులో వసూళ్లకై యేర్పాట్లు

బొంబాయి, జూన్ 2: పండిత జవహర్లాల్ నెహ్రూగారికి భారతజాతి పక్షమున రొక్కపు సంచి సమర్పించుటకై యేర్పాట్లు జరుగుచున్నవి. ఇందుకుగాను బ్రిటనులో వసూళ్లను యేర్పాటుచేయు ఉద్దేశ్యముతో భారత నాయకులతోను, పలువురు బ్రిటిష్ అభిమానులతోను కూడిన సభ ఒకటి యిటీవల లండనులో జరిగెనని భారతదేశములో నిధివసూలుకు యేర్పాట్లు చేయుచున్న ఆర్. కే. కరాంజియాగారికి వచ్చిన కేబిలువార్తవల్ల తెలియుచున్నది.

ఈసభవారు పరిపాలనా సంబంధమగు పనిని లండనునందలి భారతమహిళాసంఘమువారికి వదలిరి. దీనికి శ్రీమతి జే. కే. హిందూసతి అధ్యక్షురాలు. వసూళ్లుచేయుటకు సభవారు ప్రత్యేకంగా ఒకఉపసంఘమేర్పరిచిరి.

నిధికి విరివిగా ద్రవ్యము సమర్పింపవలెనని విజ్ఞప్తి గావించినవారిలో రెజినాల్డు సొరెన్సన్, శ్రీకృష్ణమీనన్ గారలు కలరు. (అ. ప్రె)

## దక్షిణ క్యైషూదీవిపై బాంబులు

### శత్రుస్థావరాలకు అపార నష్టం

లండన్, జూన్ 2: జపాను నడిగడ్డలోని దక్షిణ క్యైషూపై 200 అమెరికన్ నౌకావాహక విమానాలు యీగాఫాళ ఉదయం రెండుగంటలసేపు దాడి గావించెనని టోకియో రేడియో ప్రకటించెను. ఈ బాంబుల తాకిడివల్ల నష్టాలు వెనుక 1923 సం॥లో సంభవించిన గొప్ప భూకంపంవల్ల కలిగిన నష్టాలను మీరిపోయినదని జపానువార్తాసంఘం తెలుపుచున్నది. ఇటీవల జపాను ప్రధాన నగరాలపై జరుగుచున్న మిత్రవిమాన దాడుల ఉధృతం దినదిన ప్రవర్ధమానముగ నుండుటచేత శత్రు లక్ష్యాలకు అపార నష్టాలు కలుగుచున్నవి. (రాయిటరు)

దేనా బ్యాంక్

మద్రాసు బ్రాంచి ఆరంభము

దేవకరన్ నాన్జీ బ్యాంకింగ్ కంపెనీ లిమిటెడ్ వారు ది 7-6-45 మంగళవారం నాడు మద్రాసులో ఒక బ్రాంచి తెరిచెదరు. దేనా బ్యాంకు కిప్పుడు 42 బ్రాంచీలుండును.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.